Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మద్యనిరోధక గీతావళి

ఇంక యెన్నఁడు సుజ్ఞాన మంకురించు
చేటు కాలము మీయందుఁ చేరియుంట

*    *    *

మానప్రాణముల్ హరియించు మృత్యువిదియె
భార్య పిల్లల దిగమ్రింగు పాతకిదియె
పశుధనంబులమసిఁజేయు పాపి యిదియె
ఏల విడఁజాలకుంటిరో యన్నలారా!

---

• కొండపాక వీరమల్లయ్య •

కల్లుకొట్టునందు కదలక మెదలక
మత్తుచేత పడియు మానములను
వీడి తెల్లవారి విసుగుజెందడుగదా
ప్రాణభీతి లేక త్రాగుబోతు!

---

• కే. రామభద్రమ్‌రాజు •

కులసతియింటదిట్టినను కూటికి బట్టకు లేకయుండినన్
బలగము బుద్ధిజెప్పినను బ్రాహ్మణభక్తులు నిందజేసినన్
పలువ యిదేమి మానుమని పండితులెల్లరు నొక్కిపల్కినన్
కలియుగ నాశనీ సురను కట్ట! యదేటికి మానకుందురో?



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

పర్వతం బ్రహ్మయ్య

కానగలేరో చెడ్డయని కన్నులు గ్రుడ్డియొ గాంచవారికిన్
మానసమందుసుంత నవమానమటంచునెరుంగ రొక్కొకానీ
పానము మానుమంచునిల ప్రాజ్ఞులు జెప్పవినంగరాదొకానీ
హీనపు త్రాగుడన్నధర నెందుకుజత్తురొ? మూర్ఖమానవుల్

---

పర్వతం బ్రహ్మయ్య

గృహమునకు బోవ కోపించు గృహిణినీదు
కన్నబిడ్డలె గౌరవము సున్నజేయ
పిన్న పెద్దలు రోయగా ప్రియమువీడి
సోదరా మద్యమును మాన వాదమేల!

* * *

సభలలోపల చీవాట్లు సంభవించు
వాడగూడదు మద్యము స్వీడవలెను
తగదు తగదంచు పెద్దలు బుద్ధిచెప్ప
సోదరా మద్యమును మాన వాదమేల?

* * *

మూడు పదినాళ్లు కష్టించి వాడకుండ
కూడబెట్టిన వేతనము కూర్మిబడసి



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



మద్యమున కిటుల వెచ్చించ మాన్యమయ్య
సోదరా దీని మానుమిక వాదమేల

---

• కే. సాంబసిద్దయ్య •

త్రాగిననీ శరీరమున
దార్ఢ్యత పోవును శక్తిశూన్యమా
రోగములెల్ల జుట్టుకొను
రోతురునిన్ గని యెల్లవారలున్
బాగుగ సౌఖ్యముల్ వడయు
భ్రాంతియెనీ మదినాటి యున్నచో
త్రాగుడు మానుమా విడప
తప్పదు సౌఖ్యము నీకు సోదరా

*   *   *

శాంతమునున్న జేయునవి
శాలయశంబును మాయజేయువే
దాంతవిచార మందునను
ధర్మ పరివర్తన యందు నీతి సి



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ధ్వాంతములందు నీమనము
దాలిమి తోడుత నిల్వ నీక న
శ్శాంతముదుఃఖముల్ గొలుపు
త్రాగుడు మానుము నీవు సోదరా

*　　　*　　　*

పిల్లలు కూటి కేడువగ
పేర్మియసి ఖేదము జెందుచుండనీ
ఇల్లును గుల్ల జేసుకొని
ఏమని నీమది నెంచుచుంటివియా
కల్లును ద్రాగ బోయెదవు
కాంచవు క్రిందునుమీదు నేనియున్
పిల్లల రోదనల్ వినగ
ప్రేమజనింపదె నీకు? సోదరా

———

• మోటుపల్లి కృష్ణమాచార్యులు •

~~~~~~~~~~

వేదవిరుద్ధంబు ఖేదమూలంబును
కయ్యంబునకు తానుకన్న తల్లి
ఘనకీర్తి నిలమాపు ధనమును బోగొట్టు
ముఖమున తేజంబు ముండమోపు

క్షిగి

CC-0. Jangamwadi Math Collection, Varanasi.
~~~~~~~~~~

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మద్యనిరోధక గీతావళి

కులకాంతరోయు ముక్కున కోపముదయించు
బలము నానాటికి తొలగిపోవు
చదివినచదువు దుశ్చర్యానుకూలమౌ
దుష్టసాంగత్యంబు దొరుకునెపుడు

* * *

వావివరసలజెడగొట్టి పాపకూప
ఘోరగాఢాంధమునబడ గూలదోయు
మద్యపానంబుమానుడో మాన్యులార
సారమాలేదు యిహపర సౌఖ్యనాశి
దానదారిద్ర్యదేవత తారసిల్లు

---

• సి. హెచ్. నారసింహ్మారెడ్డి •

---

పెద్దచిన్నలమర్యాద పెడకుదిప్పు
పరుషవాక్యములనోట బలుకజేయు
సంతకంతకునమిత వ్యయంబువలన
కల్లుసారాయి యిల్లునుగుల్ల సేయు

గీ॥

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ఒకరు

రంగూనుకాడిమై రమణిగోల్పోయిన
శంకరంరావును జంపెనేది
సైరంధ్రిమోహించి చచ్చినకీచకు
మరణంబునకునెద్ది మార్గదర్శి
గనై త్వనచేత గడియనుండకనీక
శ్రీమంతు నీచుగా జేయునెద్ది
కన్నపిల్లలజూచి కన్నీరుగారంగ
యింటినిల్లాలు నేడ్పించునెద్ది

* * *

యట్టిమద్యంబు సేవించి యాయువంత
వ్యర్థముగజేసి యర్థసం పదలబాసి
దుఃఖభాజనులై మీరు దోషములకు
పాలుగాకుండుడయ్యయో భారతీలార!

— జి. వెంకయ్య —

పదపడి మద్యపానమ్ము వలన మనకు
పదునైదుచేటులు పరగగలుగు.



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మద్యనిరోధక గీతావళి

మొదలుధనంబునూ మొగతనంబునుబోయి
మానంబుపాళిణంబు మఱియుచెడును
దాహంబు హెచ్చయ్యె దేహంబుపిచ్చయ్యె
ద్రోహంబుబుట్టు నదేశిక మెచ్చు
మసన సల్ కన్నుల మరిచూపుతచ్చగు
కన్నతలిదండ్రిలు గానరారు

*　　*　　*

గురువుదైవంబు పెద్దలగుర్తుమర్చి
నిత్యకాయంబు కర్మల నియముదప్పి
జన్మసాఫల్య మార్గంబుజేరకుండు
గాన! ఈ పాపిమద్యంబు మానుడయ్య

---

• ఆ. మ. శ్రీరంగాచార్యులు •

ఇల్లునుగుల్లఁజేయు బలమేమియునుంచదు, కీర్తి, గౌరతల్
చెల్లు, సుఖంబుసున్న, సభజేరగనివ్వదు రక్తమాంసముల్
కుళ్లగజేయు నీచమతి క్రూరముకూడదు కూడదయ్య ఛీ
కల్లునుదాగివబోకు. మదికాదమృతంబు విషంబుసోదరా!

గిరి

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

పలివెల వేంకట అప్పారావు

♦ పలివెల వేంకట అప్పారావు ♦

తెగత్రాగినడివీధి జగడంబులాడుచు
పరువునుగోల్పోవ భావ్యమయ్య
త్రాగి దేహస్మృతి దప్పిపొర్లాడుచు
పలువురుఛీయన బడుదురయ్య
అధికముగను త్రావి యటునిటుసోలుచు
తిరుగవస్త్రమువీడ తెలియరయ్య
కులగౌరవము బాసి పలునిందలను మోసి
చెడుసహవాసంబు జేతురయ్య

*  *  *

ఔర! మర్యాదయా యిది యన్నలార!
శౌర్యధనులార! సద్గుణధుర్యులార!
భవ్యగుణులార! భారతభ్రాతలార!
నీచమధుసేవమానుడి నేస్తులార!

*  *  *

మానగదరయ్య యీమధుపానమింక
అనుభవించినపాట్లను మనసుకరుగ
బోధగావించి యీత్రాగుబోతువృత్తి
మానయత్నింపుడీదయ మాన్యులార!

గీ.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మద్యనిరోధక గీతావళి

♦ యన్. యాదవ రంగదాసు ♦

మెచ్చరుసజ్జనాళినిను మేదినిలోనదురాత్ముడంచుబల్
కుచ్ఛితకార్యముల్ సలుపుక్రూరుడవంచును మాటిమాటికిన్
అచ్చెరువొందుచుండెదరు యాప్తులుగూడదటంచు దెల్పినన్
తచ్చుడనీవు మద్యమును దూరముజేయవదేమి చిత్రిమో?

---

♦ అంబటిపూడి వేంకటరత్నం ♦

కడుపేనిండని కష్టజీవనముల
గాసిల్లినీపిల్ల లే
డ్చెడి ఘోరార్తనినాదమెవ్వనికి గుం
డెల్ వ్రక్కలంజేయదో
చెడుగా! చాలదె పాపమింతటికి చే
సేతన్ సురందాగివి తూ
గెడు మైమత్తున జావమోదెదవు సి
గ్గలేదో నిర్భాగ్యుడా!

*　　*　　*

నెన్నురుపీల్చి సత్తువను
నిర్మథనంబొనరించు కల్లు ముం



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

అంబటిపూడి వేంకటరత్నం

తెత్తి గుటుక్కునన్ గుటక
లేయుచు త్రావెదవోరిమూఢ ! సా
క్కెత్తును, సోలితూలి తెగ
నేతువు హంతక ! ఆలుబిడ్డలన్
మొత్తుకొనంగ నీమనసు
మోటుకట్టారిగదా నరాధమా !

*  *  *

పర దేశంబులలో పవిత్రమని సం
భావింతురో ఏమొ, ఈ
భరతక్షోణిని ఘోరపాతకముగా
భావించిరద్దాని, సో
దర ! నీవయ్యదిగ్రోల దొంగవయి శు
ద్ధక్షేమమా జీవికన్
పరిభూతంబొనరింప రెంటచెడు ప్ర
భ్రష్టుండవే యాటకున్

---

• మేడేపల్లి రామజోగారావు బి. ఏ. •

కష్టపడి చెమటూడ్చికూర్చిన
శిష్టద్రవ్యము కల్లుకొరకై
నష్టపఱచిన నేమిమిగలెను
స్పష్టపరవుము సోదరా !



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



అలవితప్పెను దేహదార్ఢ్యము
తెలివి తేటలు శూన్యమయ్యెను
కలహమందరి తోడ హెచ్చెను
మాను మద్యము సోదరా!

*　　*　　*

యిల్లువాకిలి చెల్లిపోయెను
నల్లపుస్తెయె మిగిలిపోయెను
పిల్లలాకట మాడుచుండిరి
కల్లుమానవ ? సోదరా !

*　　*　　*

యిల్లుగుల్లయె
కల్లబ్రతుకయె
నెల్ల సున్నయిపోయినను యీ
కల్లువీడవ ? సోదరా !

---

• ముదిగొండ బ్రహ్మయ్య లింగశాస్త్రి •

పరమపతివ్రత భాజనులైనట్టి
యువతీలలామల చావుగోరు



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

ఉప్పులూరి నారాయణ

అనుసృతాచార మవలంబనంబన్న
మందబుద్ధినిచూపు మద్యమిలను
నిరతమార్జించిన నిర్ణీతధనమును
సూర్యాస్తమయముకే సున్నజుట్టు
ధర్మసాధనలకు నార్యమాతనువును
రోగలంపటులచే పోగుచేయు

* * *

కూటికిని గుడ్డకును సాటికులములోన
వెలతిపడచును వేసారి తెలివిలేక
జీవితాశయమట్టుల సిగ్గులేక
వెఱ్ఱినీళ్ల కుభ్రమచెంది యేడ్చెదేల

———

• వుప్పులూరి నారాయణ •

కల్లును సారయు త్రాగిన
పిల్లలు పెద్దలకుగాని పిచ్చనిపించుగా
ఇల్లంత గుల్లయౌనిక
చెల్లునె! యెవరైన చూచి ఛీ ఛీ యనరా



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మద్యనిరోధక గీతావళి

• కొండపాక వీరమల్లయ్య •



త్రాగిన చెడు నీ దేహము
రోగము లెన్నెన్నో గలుగు రోతురు సుజనుల్
భోగములను బడదలచిన
త్రాగుడు మానంగవలయు తడయక సుమతీ

*   *   *

కోరకు కల్లును సారను
చేరకు మీ మద్యపాయి చెంతకుప్రీతిన్
దూరకు గొడుల కొంపల
కారగ్గిలో బడినయట్లు గదరా సుమతీ



• పి. బ్రహ్మయ్య •



కల్లు సారాయి గంజాయి, కయిపుచేత
స్మృతిలోనుండక చెడుగునే మేలటంచు
పాప కార్యాలలోనప్రవృత్తము డగును
గాన వీనిని మానంగ గడగుడయ్యా



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

• ఆచి. వెంకటాచార్యులు •

ధనమున్నాశమొనర్చియుర్ విమల మేధశ్శక్తిమాయించి పే
రునుపెంపుర్ దొలగించి జీవితముమార్పుర్ జెందగాఁజేసియా
రని కష్టంబుల పాలొనర్చి తుదకుర్ ప్రాణంబులర్ దీసికొం
పనుగాల్పించును మద్యపానమతి దుర్వారోగ్రహృద్రోగమై

*　　*　　*

ఏవాడజూచిన నావాడ ఋణదాత
　　లతిరోషమున దూల నాడుచుండ
ఏనాడు కనుగొన్న యానాడె చుట్టాలు
　　విసుగుర్ చీవాట్లు విసరుచుండ
ఏవంక జూచిన నావంక నే హితుల్
　　గౌరవానర్హుగా గాంచుచుండు
ఎచ్చోట కనుగొన్న నచ్చోటనే ప్రజల్
　　హీనాతి హీనుగా నెంచుచుండ

*　　*　　*

భార్య బిడ్డలు కంగారు పడుచునుండ
మద్యపానాభినిరతి నున్మత్తులయ్యి
వీధి దిరుగాడు నీచుల విధముజూచి
నైన జేరకుడింక మద్యాలయముల



Digitized By Siddhanta eGangotri Gyaan Kosha
CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



◆ పుల్లగుమ్మి వేంకటాచార్యులు ◆

కలుతాగ్రిగిన వారికిభూ
వలయములో మాన మతులు బలములు నీతుల్
కుల శీల యశము లబ్బవు
తలపకు డిక మీరు సురనుదాగ్రిగుటనుమ్మీ

---

◆ చకిలం శ్రీనివాసరావు శర్మ ◆

మనరాష్ట్రమందున మద్యపానముచేత దారిద్ర్యదేవత తాండవించె
మనరాష్ట్రమందునమద్యపానముచేత మతజాతిభేదముల్ మంటగలసె
మనరాష్ట్రమందున మద్యపానముచేత సత్యంబు నీతియు సమసిపోయె
మనరాష్ట్రమందున మద్యపానముచేత భోగంబులెడబాసి పోయెనేడు

*　　*　　*

ఇట్టి హేయమా జీవనంబేల! యాంధ్ర
మాత కడుపున చెఱబుట్టి మనుచునుంటి
వయ్యా! సోదరా! ఇంకనైన వగపుమాని
భావియభ్యున్నతకు పాటు బడుట మేలు



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



• నమిలికొండ కృష్ణయ్యశాస్త్రి •

మద్యపానము జేయుమనుజుని గుణములు
వర్ణింతునేనిపుడు వరుసగాను
అంజనేయుని పోల్కి యరచి గంతులు వేసి
కుంభకర్ణునిరీతి గురుక బెట్టు
కొన్ని పలుకులు వేగ కోయిలవలెపల్కి
కొంటెతపమును జేయ కొంగరీతి
పకపక నవ్వుచు......రీతిగ బొర్లు
మైమరచి వస్త్రముల్ మహినిత్రోయు

* * *

కల్లు సారాయిలను ద్రావికలుషమతులు
ఇహముపరమును నొల్లక యీల్గుచుంద్రి
గాంధిమహాత్ము నుపన్యాసగరిమగాంచి
తెలివితోనుండుడో యాంధ్రదేశులారా

---

• చిదిరె లక్ష్మణశాస్త్రి •

బహుతర కష్టసంపాదితమైన యా
తల్లిదండ్రుల యాస్తికల్లుకామె



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



పరిణయవేళసం బరముననిడినట్టి
యిల్లాలు సొమ్ములు కల్లుకాయె
అత్తగారుకరగ్ర హణకాలమునందు
కానుకలిడినవి కల్లుకాయె
పెక్కుకష్ట మొనర్చి రొక్కమార్జించిన
గవ్వైనగతిలేక కల్లుకాయె

* * *

జిహ్వాచాపల్య మెట్టిదో చెప్పరాదు
దోసమనిపుణ్యమనునది దోపనివదు
కల్లు సారాయి గ్రోలగ గాంక్షయేల
వలదు వలదింక మిత్రభూ వలయమందు

---

• బెల్లంకొండ విశ్వనాథరావు •

'అన్న మోరామచంద్రా' యటంచు సింట
నాలుబిడ్డలు నాకటల్లాడుచుండ
వీధివీధికి దిమ్మరి విసుకులేక
గూడుగుడ్డల దూరమై మాడనేల ?



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

### బెల్లంకొండ విశ్వనాథరావు

ఒరులదిట్టుచు దగవుకు బరుగులిడుచు
బోయిదెబ్బలుతిని వాపోవనేల ?
పలుకుబడిదగ్గి దైన్యంబు బడయనేల ?
పిచ్చియెత్తిన చందానబిచ్చమేల ?

* * *

ఇన్నిటికిని మద్యపానంబె హేతువగును
దానిమానుడి మీరలు ధన్యులగుడి
మాతృదేశార్థికోన్నత మాన్యతకయి
గృహపరిశ్రమ కార్మికవృత్తులలమి.

---

### శ్రీకృష్ణమాచార్యులు

మద్యపానముచేత మత్తులై కొందరు
దారిద్ర్యదేవికి దాసులైరి
కలుఁదాగికొందఱు గౌరవనీయులు
నవమానములఁబడి యధములైరి
కలుఁదాగికొందరు కాన్తలుబరులచే
భంగమొందిరి పతివ్రతలుగూడ
కలుఁదాగికొందరు ఘనరోగములఁజిక్కి
తుదకుఁబ్రాణంబుల దోలుకొనిరి



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



కల్లుగాదిదిమీకు కలిరాజొసంగెడు
మనుజులపాలిటి మచ్చునీరు
మద్యమా యిదికాదు మానాభిమానముల్
మరపించు భేతాళ మంత్రజలము
మధుపానమిదికాదు మానుడంచేడ్చెడు
భారతభూమాతృ బాష్పచయము
సురకాదుదారిద్ర్య సుందరితో మీకు
జేసినపట్టాభి షేకజలము

*　　*　　*

భారతీయులు సత్సదా చారపరులు
మీరలజ్ఞానమున జిక్కినారలికను
కన్నుఁదెరచియుఁదెలివినిఁ గాంచుడయ్య
వలదువలదయ్య యీమద్య పానబుద్ధి

———

◆ జి. రాధాకిషణ్ రావు ◆

పొద్దంతకష్టించి పొట్టకుదినకుండ
కల్లుకొట్లకు కూలిగట్టనేల ?
తన్మయంబై మెట్లు తారుచింటికిజేరి,
ఆలితోజగడంబు లాడనేల ?



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

జి. రాధాకిషన్ రావు

సంకటంబులుగ యథేచ్ఛంబుగా సురపాని
నీవలకీతి వర్తింపనేల?
పరిష్కృతిసిద్ధంబైన పానీయములమాని
కడుపారసారాయి గుడువనేల?

* * *

మైకమనుభూత మంగానసోకకుండ
రక్షబూనుమ నేడె శ్రీరాముదలచి
దేశమున బలసంపదల్ తేజరిల్లు
మద్యపానమ్ము మానిన మాత్రముననె

* * *

తూగిపడెదవు కాదేనివాగుచుందు
నష్టకష్టాల పాలౌదువంతెకాదు
బంధుమిత్ర సుతాదులెవ్వారుగనగ
నేవగింతురు నీ తెఱంగెరిగిగాన

---

♦ అత్తలూరి విశ్వనాథశాస్త్రి ♦

ఎట్టిసుఖములనేనియు నీయలేని
కల్లుత్రాగుటమాని సుఖంబుబొంది
యాయురారోగ్య భోగభాగ్యములతోడ
భరతమాతను సేవింపబూనుడయ్య



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

## మద్యనిరోధక గీతావళి

**• సయ్యద్ అలి •**

మద్యపానముముందు మానహరణముజేయు
సరణిఁదెలియకనోరుఁ దెరచినపుడు
భక్తియుక్తులఁ బటాపంచలుగావించు
నాచారమంతయు నగ్ని జేర్చు
నంతకంతకుకాయ మగ్నిలోఁజొన్పించు
నటునిటు బొరలించు నవయవముల
నెన్నడైననుదీని నేమ్రింగననుపించు
నగ్నిగ్రోలితినంచు నడలఁజేయు
నెంతధన్యులనైన హీనులుగామార్చు
ముఖవికాసమునంత ముడుగఁజేయు
నరచిననరపించు సంతకంతకు హెచ్చి
యేడ్చిన నేడ్పించు నేదిలేక
వ్యసనాదికృత్యంబు లసమానముగగూర్చు
సిగ్గుయెగ్గులనొద్ద జేరనియదు
కపటకిల్బిషప్రవృత్తిఁ గన్పట్టనీయదు
మటుమాయముగజేయు మానుషమును
ఎన్నిజాగీర్లయిన నిచ్చెదననుపించు
కాసుదగ్గరలేని కాలమయిన



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

సయ్యద్ అలి

గొప్పవారల కేను గురుమూర్తి ననిపించు
దాసిగాడనటంచు దలపజేయు
నరికిన నురికించు నూహాపోహాలు దప్పి
సందికిబడజేయు మొండి కత్తి
చెనటిపందలకయిన చేజాచగాజేయు
వెలలనెంచక పారవేయజేయు
నావివరుసలు పనికి వచ్చునాయనిపించు
పరిహాసవృత్తినే ప్రబలజేయు
పరియాచకములాడ బ్రాజ్ఞుడననిపించు
దనను బ్రహ్మనుగాగ దలపజేయు
శాస్త్రసమ్మతమైన సరణిగాదనిపించు
నీల్గించు నేగొప్ప నేతననుచు
గోరినట్టఫుకూత గూయగాదొడగించు
దన్నులసాపాటు తగదనర్చు
గొండెమ్ములైనను గూయుయత్నము సేయు
తనయింట పరులుగాదలపజేయు
విత్తవంతుడనంచు విఱ్ఱవీగగజేయు
మిగిలిపోయిన వేళ మిడుకజేయు
కూటికో గుడ్డకో కొదువనుగలిగించు
పానంబు హెచ్చయిన బ్రహ్మకైన



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



నిట్టిదుశ్చేష్టలోన గూర్పుహీనజలము
బుచ్చుకొనునరుడు తన పరువుబోక ముందు
యంతరంగముననిది హీనమనితలంచి
వదలివేసినవాడే పోవైష్ణవుండు

———

• ఆయట్ల వెంకటనృసింహాచార్యులు •

కల్లుసారాయిూల కంటజూడకుడయ్య
కంటజూచిన తాను వెంటనంటు
వెంటనంటిననిన్ను యింటనుండగనీదు
యిల్లువిడిచిన సొమ్ముమ్ముడుల్ల జేయు
సొమ్ముమ్ముడుల్లయినని నమ్మకుందురుజనుల్
నమ్మకుండిన పర్వునాశమౌను
పర్వునాశనమైన పదిమంది చీయందురు
పదిమంది జీయన్న బ్రతుకికేల

* * *

సోదరామానరాయంచు నీదుయెదుట
నిలచిప్రార్థింపుచుంట మున్నెప్పుడింక
యిట్లుత్రాగనటంచని వొట్టుబెట్టు
నుము శ్రీలక్ష్మినీకేలు గొనునుగాదా



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

చిక్కడుగాయల నరసింహాచార్యులు

భారతమిత్రులార మిము ప్రార్థనజేసి వచింపుచుంట సం
సారముపాడుచేసెడి విచారకరంబగు కల్లుసారనే
తీరుననైన వీడుడు సుధీమణులెల్లరు మెచ్చునట్లు మీ
ధీరతజూపుడయ్య యదె దేసికిజేరగ జూచుచుండెనిక

---

• చిక్కడుగాయల నరసింహాచార్యులు •

కల్లుద్రాగుటదోషకరమని వేదముల్
శాస్త్రపురాణముల్జాటుచుండ
సంసారికులుద్రావ సంసారములబాపి
సన్యాసులనుజేయ జాలుకల్లు
విద్యాధికులనైన వెర్రివాండ్రనుజేసి
గంతులవేయింప గలుగుకల్లు
మానవంతులనైన మానంబుదెగనమ్మి
హీనత్వమొందింప బూనుకల్లు
లక్షాధికారులు లావణ్యమునద్రావ
భిక్షులుగాజేయ వెలయుకల్లు
నావివర్పులులేక గానరమూనించి
కామత్వమొందింప గల్గుకల్లు



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



రక్తనష్టచేత శక్తిహీనముగొల్పి
ఘనరోగులనుజేయ దనరుకల్లు
బంధుమిత్రులప్రేమ బాపిపోట్లాటతో
తలలుబగులగజేయ నలరుకల్లు

---

• బండ వెంకటరామరెడ్డి •

అసలెదరిదరిత్రా మహిమ కాశ్రీమైనది తెల్గునాడు నే
డొసరగజేయునెంచిరి యిటేకడునీవును శ్రద్ధబూని వా
రొసగెడి వాఙ్మఖంబులను నొప్పెడిభావములెంచిమంచి నే
ర్పెసగంగ తారివమానికడు నేహ్యామటంచును చెప్పుమిత్రమా.

*　　　*　　　*

మతిచెడిపోవ్రవెర్రిగతి మాద్యముమునెత్తికి నెక్కుకొర్రిత్రి య
ట్లితరులవెక్కిరించుచు, నగించుచు, చుల్కనయౌచు, చోరతా
స్థితిగని నీచవృత్తులంజేకొనజేసెడినిట్టినీచమౌ
జతసముమానికూడదని చాటుముమిత్రులతోడ నెచ్చెలీ



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

చెన్నమరాజు కొండలరావు-వెంకటేశ్వరరావు

• చెన్నమరాజు కొండలరావు-వెంకటేశ్వరరావు •

పలువురు నింద జేయుటయు బాలురునాలునుతిండికేడ్చుట
లక్కలధనమెల్లబోవుటలు కాని వివాదలుదాపరించుట
ల్నిలునను నీడలెకకడు నీచప్రవృత్తికిలొంగిపోవుట
ల్గలుగును మద్యపానమిల. గర్హితమెన్నిటనెంచిజూడగ౯

*　　　*　　　*

ఇహపరములందు గీడుగల్గించుకల్లు
కల్లమాటలుబల్కించు గవ్వలేక
బిచ్చమెత్తంగ జేయును పెంపుదూలు
కలహములపుట్ట ఈ మేటికల్లుముంత

*　　　*　　　*

ఏలకులుజాజికాయలు పొలిమి
తాంబూలచర్వణోపాయంబు
లైనన్నాసరించిన మద్యముగ్రోలిన
పెనుకంపునోట గొట్టుర సుమతీ

---



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



• శ్రీకొమరవోలు నాగభూషణరావు •

తగనిపని యిది తమ్ముడా !
నగవుజేటగు తమ్ముడా !
మరణహేతువు మద్యపానము
మానుమోయీ తమ్ముడా ! ॥తగని॥

*    *    *

చక్కనగు సంసారమంతయు
సర్వశూన్యంబాయెనయ్యో
మహిని నీ జీవితంబెంతయు,
మానహీనము తమ్ముడా ! ॥తగని॥

*    *    *

సుక్కిచిక్కిన నీ యాలుబిడ్డలు
దిక్కులేక కృశించిపోయిరి
ముద్దులొలికెడు వారి మొగములు
మోడులయ్యెను తమ్ముడా ! ॥తగని॥

*    *    *

నీవు చేసెడి మద్యపానము
నిశ్చయముగా వారియుసురుల
నొకటి వెంబడి నొకటిగా నిక
నూడ్చివైచును తమ్ముడా ! ॥తగని॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

బి. విశ్వనాథము

తమ్ముఁడా? హృదయంబులేదా?
కన్నబిడ్డలు కానబడరా?
అన్నమునకై వారియేడ్పులు
అక్కటా చెవిసోకవా? ॥తగని॥

* * *

నీవు త్రాగెడు మద్యమంతయు
నిజముగా నీవారి రక్తము
మేరలేని విచారమూలము
ఘోరరాక్షస కౄరకృత్యము ॥తగని॥

---

• బి. విశ్వనాథము •

అన్నరో! నిన్ను త్రాగుబోతనుచు తోడి
మానవులు సేయుదూషణల్ వేనవేలు
చెవుల దూరవుగా నీకు! చెడెనె మనసు!!
మానవత్వమునోడియు న్మత్తుడగుచు
వన్యమృగజాతి రాజ్యాన వాసమేర్ప
రించుకొన సిగ్గుజెందవదేమి!! నీదు
నిల్లును గుల్లగా నోర్తుగాని



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



దాని పీడగనోర్వవా ? త్రాగుబోత !!
నీకు నీవారికని, నీదు నేస్తులకును,
కులమువారికి జాతికి తలలవంపు
గలిగెనీచేత నికనైన వలదు త్రాగ
కల్లు సారాయి గంజాయి పెల్లుద్రావి
సొక్కిసోలుచు పశువులై స్రుక్కినట్టి
నిన్ను జేపట్టు భార్యకే నేమ సుఖము ?
సత్యముగనేను గృహలక్ష్మి సాధ్వియేని
దేశ సౌభాగ్య లక్ష్మి యాదేశమెరిగి
నిన్ను త్రోవకు రాబట్టకున్నె చెప్పుమ

———

• పెట్లపల్లి రామరావు •

పరమ విజ్ఞానులౌ
భారతీయుల పూర్వ
గౌరవంబును నిల్ప
గాదలంచిన నీవు ... మద్య



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

పెట్లపల్లి రామరావు

రాజ రాజులుగాని
లక్షలున్నను వాని
నిముసమాత్రింబులో
నిర్మూలనముచేయు ... మద్య

* * *

కర్తవ్య పథమును
కాలితో తన్నించు
కారడవిలో నిన్ను
గాసిల్లగాచేయు ... మద్య

* * *

నిగనిగ లాడేటి
నీదు చక్కనిమోము
నిముసమాత్రింబులో
నిన్త్రెలు మైపోవు ... మద్య

* * *

దినమెల్ల చెడదాగ్గి
ధనము దొరకక భార్య
మెడను గట్టిన పుస్తె
విడదీసి తాగ్గించు ... మద్య

---



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

# మద్యనిరోధక గీతావళి



## రెండవ భాగము

# పా

# ట

# లు

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మద్యనిరోధక గీతావళి

• శ్రీమతి సీతాకుమారి •

: మాదిరి :

( హం ముల్కే దక్కన్‌కే )

: పల్లవి :

ఈ కల్లును మానిన మన దేశమునకు
కలుగును కలిమిముదంబులిలన్
పిల్లలు దృఢముగ బెరుగుదురండీ
తల్లులు జగడము మానెదరు ॥ఈ కల్లు॥

: చరణం :

అలచైనాలో, ఆటర్కీలో, ఆమెరికాలో మానారూ
మనమును మానిన మనుజులమండీ
మానకపోయిన దనుజులమూ ॥ఈ...

* * *

ఏ మతములలో లేదండీ, ఈ మద్యము త్రాగుట మంచిదని
హిందు ముల్కాను క్రైస్తవ పార్శీ
గ్రంథములన్నియు నిరశించెన్ ॥ ఈ...



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ప్రాణము, మానము కావలెనంటె ప్రపంచకములో కుదురదురా
ప్రాణవలసిన మానము వదలుము,
మానముగోరిన ప్రాణముల్ ॥ ఈ...

*　　*　　*

మానిని సీతకుమారిరచించిన సూనృత వాక్కులు వినరండీ
ఆలు బిడ్డలకు అన్నము తెండీ,
అనయము సారా వదలండీ ॥ ఈ...

---

◆ నడింపల్లి జానకిరామయ్య ◆

: మాదిరి :

( బన్సీవాలేనే )

: పల్లవి :

విన్నాపము జేయుదు జనులార
మన్నించియు వినుడు మన సార
మత్తు పదార్థ సేవనము
మరియాద లేని జీవనము
విత్తము వ్యర్థముగా వ్యయము
చిత్తము స్వార్థ్యము చెడు నిజము ॥విన్నా॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు

కల్లును మరియు గంజాయి
ఇల్లంతయు జెరచును సారాయి
పిల్లాలు నాలును చెడిపోయి
ఎల్లరకును జాతుకు చేదోయి

———

• మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు •

: మాదిరి :

( మాకొద్దీ తెల్లదొరతనము )

: పల్లవి :

కల్లుసార తాగవలదు సోదర అయ్యో!
ఒళ్ళుయిల్లు గుల్లజేసి తల్లిపిల్లల నేడిపించు ॥క॥

*　　*　　*

కడుశ్రమలకునోర్చి గడియించిన సొమ్ము
గాండ్లవారికి యివ్వనేల, ఇచ్చి,
నీచునివలె నిల్వనేల, నిల్చి

లాగి

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



చెయిజూచి యాచించనేల,
కైపువచ్చే కల్లిమ్మననేల,
నివ్వచెడతాగి పడిదొర్లనేల,
దొర్లి పిచ్చివాగుడు వాగనేల,
వాగిదెబ్బ మొగముతో తిరుగనేల,
పర్వమర్యాద బోనాడనేల,
పరులు నవ్వుచుండగ జూడనేల,
మరువుమికనైన నీకల్లు త్వరలో క్షేమముగలుగు ॥క॥

* * *

ఆవు గుఱ్ఱముకుక్కలయ్యో! పందులుగూడ
అసలే కల్లును ముట్టబోవు,
ఆహా! మానవుడవైయుండి నీవు
పాడుమురికి నీటిని తాగుతావు
కీడు యెంతోకలిగిన తెల్యలేవు
పెద్దలొద్దన్న కొడ్తానంటావు
వద్దువద్దన్న మద్యము వదలిపెట్టుమన్న ॥క॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మంత్రిప్రగడ వెంకటేశ్వరరావు

మతములన్నియుగూడ, మద్యముచెడుదని
హితము చెప్పుచుండ వినవు
సతము మతిలేక తిరుగుచుండెదవు
సుతుల నిల్లాలు నేడిపించెదవు
పాతకములెన్నొ జేయుచుండెదవు
బతుకు దెరవంత మంటగల్పెదవు
సుంతమనవి వినినాదు మద్యము మానుము ॥క॥

*　　*　　*

భుక్తిముక్తినిచ్చు, భూమి పన్నుమించి
శక్తిహీనుని జేయగనవు
ముక్తియిందేగలదని నమ్మెదావు
శక్తి బహుహెచ్చునని తలచెదావు
భక్తి ధృడముగ నిల్చునంటావు
రిక్తహస్తముల దిరుగుచుంటావు
యుక్తాయుక్తములను తెల్యలేవు
మానువేగమె సోదర మద్యపానము నీవు ॥క॥

*　　*　　*

సర్కారుద్యోగులు, సరసులు, జ్ఞానులు,
తగదు మద్యము త్రాగుటనిరి



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



మానవుని మతిబోగొట్టు ననిరి
మద్రాసు సిస్టముచే మాన్పింతుమనిరి
పన్ను హెచ్చించి బోధింతుమనిరి
అన్న ఎన్ని జేసిన నీవు కల్లుమానవి దేమి ? ॥క॥

* * *

పూటపూటకు నీవు కూటిగుడ్డకులేక
పాటుపడి తెచ్చిన ధనము, ఏల
నీటి పాల్జేసెదవు వినుము
చాలుచాలు త్రాగ మానుకొనుము
మేలుగలుగును నా మాట వినుము
చాల దేశాలలో దీని త్రాగమానిరన్న ॥క॥

* * *

పాలు నెయ్యి మంచి పానీయముల ద్రాగ
చాల బలము హెచ్చునన్న
మానుమీపాడుకల్లు మాయన్న
మేలు నీకెంతో కలుగు జూడన్న
బాలబాలికలకు నెవరుదిక్కన్న
మానవుని కిది చీడపురుగన్న
దీని నిర్మూలమొనరింపుమన్న
అన్న మాయన్న నామాటనాలకించుమన్న ॥క॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

రేమిడిచర్ల వేంకటకృష్ణరావు

♦ రేమిడిచర్ల వేంకటకృష్ణరావు ♦

~~~~~~

: పల్లవి :

మద్యపానము మానరా సోదరా!
సద్యశంబును జూడరా!
నీతినీమము బాపి జాతికీర్తిని మాపి
చేతికిని నొక మట్టి చిప్పనీకిచ్చురా ॥మద్య॥
కలిమిరిగమిఱింగి వ్యాకులము మదిగూర్చి
హృద్బలమంత లాగి దుర్బలునిగా జేయురా ॥మద్య॥
ఆలుబిడ్డలుకూటి గోలసేయగవారి
గాలదన్నుట మాని ఘనముగా మెల్గరా ॥మద్య॥
ఇల్లుగుల్లిగసేయు కల్లునీకేలరా ?
చల్లగాబ్రతికి నీ యిల్లుభువి నిల్పరా॥ ॥మద్య॥
ఎత్తి నరజన్మంబు మత్తులకు దలయొగ్గి
మిత్తి వాకిట మెల్గ చిత్తమెట్లొప్పురా ॥మద్య॥
బూతుకూతలు మాని నీతివంతుడవై
ఖ్యాతిగాంచుము దాన శాంతినీకగునురా ॥మద్య॥
బలహీనుడీవంచు దెలిసెనా భూపాలు
డలుగు దేశీయులకు దలవంపులౌనురా ॥మద్య॥
సత్యమేజయమంచు నిత్యమును నమ్మి
సాహిత్య జన్మముకొరకు హితసేవసేయరా ॥మద్య॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.
~~~~~~

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

## మద్యనిరోధక గీతావళి

♦ అజ్మతుల్లా కవి ♦

మంగళమగు నీకూ మిత్రిమా
మద్యపానమును మానితివేని
క్షీరముదధిఘృత శర్కరా మధుఫలా
హారములను వేమారుభుజించుమా ॥మంగ॥

* * *

హాయియనుచు సారాయితాగుదువు
కాయముపాడగు కారణమెఱుఁగవు
అలుపిల్లలల్లాడినఁ జూతువు
జాలిలేకనో కాలసర్పమా ? ॥హాయి॥

* * *

కల్లుతాగి ఘనులనుదూషింతువు
తల్లిదండ్రిగురువుల నిందింతువు
సిగ్గులేకచిందులు దొక్కెదవు
భగ్గునమండుచు పాపము సేతువు ॥కల్లు॥

* * *

ఘనకార్యంబని కల్లుతాగెదవు
ధనముపోవు మానము చెడుబాబూ !
దార్ఢ్యముచెడు దారిద్ర్యము హెచ్చును
ఘోరదుర్గతుల గూలుటమేలా ! ॥ఘన॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

చకిలం శ్రీనివాసరాయ సర్మ

సారమత్తుచే సడలను దేహము
నీరసంబు నిత్యము వర్ధిల్లును
భారతమాతకు బాధలు హెచ్చెను
పారమార్ధికము పరికించుముధర ॥సార॥

---

చకిలం శ్రీనివాసరాయ శర్మ

### గేయము.

మన నిజాంరాష్ట్రాంధ్రభూమిలో మంచివారిని చెడ్డచేసెను
మంచిచెడ్డకు కారణంబిదె మహిమ దెలియక సోదరా!
మద్యపానమె విషము మనకిక మద్యమేమనకాత్మ నాశము
ధనముధాన్యము గోల్పోవుట తప్పవెన్నడో సోదరా!
కలహామునకిది కారణంబును కష్టములకిదె కారణంబై
కలుములెల్లను లేనిజేసెను కలియదెలియుము సోదరా!
మద్యపాన నిరోధదినమున మార్చి రెండవ తేదిరోజున
మన నిజాంరాష్ట్రాంధ్రులెల్లరు మమతతో నొకచోటగూడియు
మద్యపానముతగదటంచును మానుడని యెకుశాస్త్ర్య గీతము
మూలమూలను దిరిగిచెప్పుట ముఖ్యమేకద సోదరా!



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మద్యనిరోధక గీతావళి

♦ బెల్లకొండ విశ్వనాథరావు ♦

మాదిరి.

(తారక మంత్రము కోరిక దొరకెను)

: పల్లవి :

మద్యముద్రావిన మనుజున కెంతయు మాన్యతపొసగదు ఓరయ్యా
సద్యశమందిన సంసారంబది క్షణములో సమయును ఓరయ్యా ॥మద్య॥
తల్లి దేశమతి దార్ఢ్యా గ్యస్థితి దల్లడమందుట గానండీ
తల్లికినార్థిక దశహెచ్చింపగ నుల్లాసముతో బూనండీ ॥మద్య॥
కార్మిక కర్షక ఘనవృత్తులతో గౌరవమందుట మేల్గాదే
మర్మము దెలిసియు మద్యపానమును మానుటకైనను వీల్గాదే ॥మద్య॥
కూటికిగుడ్డకు గొరతయిపిల్లలు గోడుగోడుమని యేడ్వంగా
మాటిమాటికి మద్యపానుఁడు బైటికి మిమ్ములనీడ్వంగా ॥మద్య॥
నడువ వేరుగా నుడువ వేరుగా గుడువ వేరుగా ఓరయ్యా
విడువక ద్రాగుచు నిడుములగుడుచుచు బుడమిని జెడుదురు ఓరయ్యా
ఇహపర సౌఖ్యము లెంతయుగల్లవు విహితమె మీకిది ఓరయ్యా
బహుతర పాపవి పత్తులలోబడి ప్రాణము వీడుదురోరయ్యా ॥మద్య॥

మాదిరి

(రామనామమను మిఠాయి యిదుగో)

: పల్లవి :

నిరోధకంబను మిఠాయియిదుగో బిరానగొనుడయ్యా
నిరాకరించక బిరానమీరలు బిరాకునిడుడయ్యా ॥నిరో॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

### చల్లకొండ విశ్వనాథరావు

మద్యపానమను మారీవ్యాధికి మధురమైనమందుర
హృద్యముగాదని యారోగ్యముచే వృద్ధిగాంచుడిందుర ॥ నిరో ॥
దారిద్ర్యంబను ఘోరభూతమును భారతోర్విలుమంత్రిం
భారత దేశము భాగ్యసంపదలు బడయదగినతంత్రిం ॥ విరో ॥
సోమరితనమును శోకముమాన్పెడు చోద్యమనగనిదియే
పామరత్వమును బాపగల్గుటకు నలసినచక్కని చదువే ॥ నిరో ॥
వృత్తివిద్యలను వృద్ధిజేయుటకు నుత్తమమార్గమునుండీ
సత్తినిపొత్తును నిత్తెముదాపగ జక్కనిదుర్గిపుజూడీ ॥ నిరో ॥
సోదరులందరి యాదరంబునకు సులభకార్యమిదికనుడీ
వాదనలేకయె కాదనబోకయె వారింపగదగవినుడీ ॥ నిరో ॥

---

### • ముదిగొండ బ్రహ్మయ్య లింగశాస్త్రి •



వద్దురా తాగుడు వద్దురా యీమద్యపానము వద్దురా
వద్దువద్దిక కొద్దిగైనను పెద్దతనమును పారద్రోలును ॥ వద్దురా ॥
నాలుపిల్లల నన్నదముల నావలికి బోదోలురా
కాళ్లుకడుపులు బట్టుకొనినను కాయమును గనలేవురా ॥ వద్దురా ॥
గొప్పధనమార్జించినను తాగూడిపీడన జేయుమద్యము
తప్పకను యీరేడు జగతిలో తథ్యముగ మీరెరయుడీ ॥ వద్దురా ॥
బుద్ధిమాంద్యము బద్ధకముచె నిద్దరిత్తిసి ఏలచెడుదురు
శుద్ధముగబోంధిచు బ్రహ్మయ్యపద్ధతుల సుఖమందురా ॥ వద్దురా ॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

## మద్యనిరోధక గీతావళి

• చొల్లేటి నృసింహ శర్మ •

కల్లుసారను విడిచిపెట్టుము
ఇల్లుగుల్లగ జేయునయ్యది
కొల్లగొను సంపదలనెల్లను

కల్లగాదుర మిత్రుడా !
నీరుత్రాగకు మిత్రుడా !

మత్తునస్తుల వీడుమనికుల
పొత్తములు ఎలుగెత్తుచున్నవి
సత్తుపోవును మత్తుపట్టును

సారత్రాగకు మిత్రుడా !
నీరత్రాగకు మిత్రుడా !

ఇంటియాబిడ నగలగొనినీ
కంటబడగనె కల్లుద్రాగుచు
పెంటిపైబడిపోయి వంశపు

పేరుమాపకు మిత్రుడా !
బీరు త్రాగకు మిత్రుడా !

మనువుదెల్పె మహాత్ముఁడనియెను
మానమని వేదంబుచెప్పెను
తనువుచెడుధన వ్యయముకల్గును



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

సరిపెల్లె విశ్వనాథశాస్త్రి

దారు త్రాగకు మిత్రుడా !
సారహీనము మిత్రుడా !
సారమృత్యువు కలుఁగజేయును
సారహృదయము పాడుచేయును
సారకిల్లును త్రాగబోకుము
శక్తిగాదది మిత్రుడా !
భుక్తిగాదది మిత్రుడా !

---

• సరిపల్లి విశ్వనాథశాస్త్రి •

శ్రీలనేలురత్నగర్భ చిక్కచిన్నపోయెరా
పాలవెల్లివెల్లగిడ్డి నట్టిపేరులాయెరా
నేలయీను పాడిపంట నేలమట్టమాయెరా
ఆలుగోల బాలగోల లన్నచూడవేమిరా ॥

*  *  *

తూరుపార సూరుడొచ్చె తూలితూలివత్తువా
కారుకూత రేతిరెల్ల కాల్వలోన పంటివా
ఆరిరోజు కూలికల్లుకైతె ఆలుబిడ్డనా
దారుతల్లికూటికేది దారిగుడ్డకేదిరా ॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



అన్న తాగనంటి వొట్టులంటి నిన్న కూలిలో
చిన్ని పాపకుగ్గుపాలు చీకుతల్లి కొక్కుపా
తన్నమింత గంజితోడ అరగింతునంటివి
కన్నవారలాలియేడ్వ కల్లుతాగివస్తివా

*   *   *

ఒల్లుగుల్ల ఇల్లుగుల్ల ఓకిరింతురెల్లరూ
కళ్లుగుంటలాయెతల్లొ గంటవడ్డ దెబ్బకీ
నల్లకర్డగట్టెఅన్న పల్లుఊడెచూచుకో
పిల్లచేరరాదుబీతి పెద్దబూతమంచునో !

*   *   *

తానమాడి గంజితాగి దర్మమెంతొ సద్గివా
లానమంతులంటిగాంది లాలతిల్కురోజునీ
లానతాగమాని పల్లెలంట చారమెంటొ చే
తానుసూడటంటిగాదె ! తాగివస్తినాయమా !

*   *   *

బుద్ధిసెప్పి కూలికొచ్చి బూటకాలకెత్తివా
ఉద్దికూడి కూలిసేసి పైకమిచ్చివేసియా
ముద్దరాలు సౌద తేను ముందునిన్ను పంపితే
పొద్దుగూకె యిపుడునాకు పొద్దుగాల సోమరీ ॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



## • ఆవుల పురుషోత్తమ్. •

: పల్లవి :

మద్యపానము మరువవలెనండీ । జనులార మీరు మంచి మార్గము వెదకవలెనండీ ॥

మద్యపానము విడువలేకను మానసంబును స్థిరము జెయ్యక । మందమతులై తిరుగుచుండిన మాన్యులని పిలువంగ నేటికి ॥

మత్తుద్రవ్యము ముట్టవలదండీ । జనులార మదిలో నష్టమెంతో తెలిసికొనరండీ । మత్తుద్రవ్యము మ్రింగినంతనె మానసంబున వెతలు గల్గియు । మిన్ను మన్నును తెలియజాలక బుద్ధిమాంద్యము గలుగ జేయును ॥ మద్య ॥

రమ్ము సారా । తాగవలదండీ । జనులార మీరు లోకరక్షకు గొలువవలెనండీ । రమ్ము బ్రాండీ రమ్యమైనా హృదయమంతయు పాడుజేసియు । రక్తమును క్షీణింపజేసియు రుగ్మతలగలిగింప జేయును ॥ మద్య ॥

కల్లువాడుక మరువవలెనండీ । జనులారమీరు కోడిగ్రుడ్లను మ్రింగవలదండీ । కల్లు త్రాగుచు హింసజేయుచు వ్యభిచరించుచు వెతలపాలై । స్వార్థపరతను వీడలేకను వ్యర్థులై తిరుగంగ నేటికి ॥మద్య॥

భక్తిమార్గము విడువవలదండీ । జనులారమీరు పాపభీతిని కలిగి మెలగండీ । భక్తిభావము సున్నజేసియు పాపభీతిని కలిగిమెలగక దొంగవేషము వేసి యిలలో భంగపడి యమభటుల జేరెడి ॥మద్య॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



: కామవర్ధనీరాగం. :

వద్దయ బాబో వద్దయబాబూ త్రాగుడుమాట మన కెపుడు
వద్దయ బాబూ ॥

యిల్లువొళ్లుగుల్ల జేసే త్రాగుడుమాట మన కెపుడు వద్దయ్యబాబూ ॥

తల్లితోడు తెలియనీక మైకము కమ్మే త్రాగుడువద్దయబాబూ ॥

పరువెల్ల పాడుసేసే త్రాగుడుమాట మన కెపుడు వద్దయబాబు ॥

కల్లగాదు నా మాట కలిమిని హరియించే త్రాగుడుమాట
వద్దయ బాబూ ॥

పురుషోత్తముని గొల్చెడు మనకు త్రాగుడుమాట వద్దయబాబూ ॥

---

• శ్రీనివాసాచార్య •

: పల్లవి : : త్రితాల్ :

అకటా ! కల్లుపైన యాసను వీడువరు
ఆకటికైన నోర్తురుగాని ॥అ॥

కూటికి లేకున్న గుడ్డకు లేకున్న
కూలి డబ్బు లోనగూడిన తోడనే ॥అ॥

మొద్దురీతికృషి నెంతయొ సలిపి
పొద్దుసంతడబ్బు త్రాగుజేసికొని



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

నలంతిఘల్ చక్రివర్తుల తంయ్యాల సింగరాచార్యలు

మొద్దులవలె తాగి మోర్లలో బడినను
బుద్ధిలేదా కోఓ బోధించినగాని ॥అ॥

నెత్తురు జెడి మదమత్తులై వెర్రి
తోత్తులనుచును తత్తరపడెదర
సత్తువ తగ్గును చిత్తము జెడుగద
కుత్తుక దెగ వాళ్ళుగొట్టుకొన్నగాని ॥అ॥

తాగినకంపు తాగుడు కంపు
సాగగ నాలిక జారగచొల్లు
భోగాహరంబని పుచ్చుపుచ్చుమని
తాగెదరహా బుద్ధి తాటికల్లు నహా ॥అ॥

---

• నలంతిఘల్ చక్రివర్తుల తంయ్యాల సింగరాచార్యలు. •

: మాదిరి :

( రండీపుణ్యాత్ములార రంగణిభజనకు )

మానుడయ్యా మాన్యులార మధు సేవనమును మానరయ్యా మహితులారా ॥ మానుడీ మధు సేవనమును మానకున్న మహిలోపల మను లేకడు దుర్లభమని మనుజులార మదినిదలచి ॥మానుడయ్యా॥

కల్లు ద్రావిన కలుగబోదు । కలిమి । మన కెల్లెడలనుకీడు మూడు



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



బల్లిమడగు బలరాముడు కల్లు దాగ్రివుట చేతగాదె ॥ చల్లని రాజ్యంబు నేలజాలడయ్యె సుజనులార ॥మాను॥
ధర్మములర్గ వినగలేదా । భూసురులు । ధర్మమే జయమనగలేదా ధర్మిగ (ననురాంపిచే) త్త్రని ధర్మజ్ఞులు దెలుపుచుండ । కర్మముగా కేమి మీరు కల్లుదాగ్రివి కలహింతురు ॥మాను॥
(సురాపాన కృతంపాపం) ఇహాలోకే । (సుధాపానేనశ్యతి) విఃవిగ నీరీతి శాస్త్రవిధులు దెల్పుచుండగర్గ । నరియని శాస్త్రోతి హాస నగిణినిఁగనుగొనర దేల ॥మాను॥
వేల్పులెల్లవినుతిసేయగర్గ । వైమానికులై । వేల్పుపథమునెక్క బోరా వేల్పుగొండనృహరితోడు వెయ్యాగు విధంబులుగను । కల్ప దూష్యమైన కల్లుకలనైనఁగాంచకుడయ్యా ॥మాను॥

---

• శతావధాని నేరళ్ల వేంకటాచార్యులు. •

( కోలలపాట )

కల్లుత్రాగవలదు జనులారా మనకు కలుగుసౌఖ్యంబేల జనులారా ॥క॥
కల్లుసారాయిలకు చెల్లించుడబ్బుతో ! పెండ్లాన్నిబిడ్డలను పెంచుకోగలరయ్యా ॥ కల్లునుదాగ్రిగితె జనులారా మనకు కలుగు లాభంబేమి జనులారా ॥క॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

శతావధాని నేరళ్ల వెంకటాచార్యులు

రిమ్మరేగాత్రాగి సొమ్మసిల్లుచుపడితే । రొమ్ముపగిలీ మీరు అమ్మలకుబాసెదరు ॥ కమ్మని నామాట జనులారా వినుడీ నమ్మండి నిజమని జనురారా ॥క॥

అక్కచెల్లెలుతల్లి యనితలంపకగల్లు తిక్కచేపై బడుచు సిక్కముగచెడెదరు ॥ పెక్కుమాటలగూసి జనులారా పెంట కుక్కలై తిరుగుదురు జనులారా ॥క॥

చెంపదెబ్బలుపడుచు ఛీవాట్లబడుచును । కొంపగుమ్ములనమ్మి కూళలైపోయెదరు ॥ కంపుకల్లుపైన జనులారా యింక తెంపుగొనుడు మనసు జనులారా ॥క॥

బాగైన మీమేను బాజారుమోర్లలో । ఊగిపడినంతనే యీగలెల్లను ముసురు । త్రాగబోకుడు కల్లు జనులారా మిగుల బాగుగా దయ్యెయ్యో జనులారా ॥క॥

సన్నాసిగాతిరుగుచున్నచో బంధువులు మిన్నుజూతురు మిము కన్నెత్తిజూడరు ॥ మున్ను జరిగినకథలు జనులారా వినక దున్నలయ్యెదరేమి జనులారా ॥క॥

మద్యపానముచేత మనసుచంచలమయ్యె । విద్యబుద్ధులులేక వేగచెడిపోయెదరు । సేద్యమును సేయుడో జనులారా ధరను సద్యశంబొందుదురు జనులారా ॥క॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



సారాయికల్లును షికారిజూదములతో రారాజులెంద రేతీర్రైరి విన లేదె । మేరగాదిది మనకు జనులారా మనము భారతీయులమయ్యా జనులారా ॥క॥

పాడయినరోగాల బాధలలోజిక్కి । యేబారిగాంచకను బీదలగు చుండెదరు ॥క॥

---

• చెన్నమరాజు కొండలరావు •

: పల్లవి :

కల్లుదాగినాను కైపెక్కిందది కల్లుదాగినాను

ఇల్లుగుల్లైపోయెయిల్లాలెడబాసెపిల్లాలమాంమాలుబిలుచుకపోయిరి॥క॥

మాతండ్రితాతలమాటలక్షలకొలది మాతరమందుమంటగలపేసిరి॥క॥

బావులుబండాలు బల్లైనతోటలు సావుకారికిచ్చి సంతాలలోమంచి॥క॥

పందెమాటలలోనపైక మెక్కుపెట్టు సందెబిచ్చగాండ్రసన్కజేరినదాక

ఆటలంటెనేమిపాటలంటేనేమి మేలైనసాముల్లెగమీటువారితోటి॥క॥

అయ్యలప్పలార అయ్యిందిపొయ్యింది నెయ్యామతోడ మీకయ్య
జెప్పినాను ॥క॥

వాటమైనకొణుదూటెనరసింగని పాటబాడిబత్తి ప్రాలైతినెలేదో ॥క॥



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



మానమవమానంబువిడనాడి మత్తెక్కుకళ్ళునప్పాన మాడ గదూళిపై బాడి। మానితంబగుగుహ్యామున జారబారకన్నులగానకను। పానభూములబోర్లజూతుము పాపమనుచును బలుకరింపము ॥కల్లు॥

ఆలుపిల్లలజోలివిడిచెదరూ। కష్టంబులోనగబాలు పానముపాడు జెసెదరు। కాలు సేతులలోన సత్తువచాలయూనని ధరినుసితాగిన సొలి పోవుటగాక భుక్తికిచాలకను కన్నీరునిత్తురు ॥కల్లు॥

నీతిఖ్యాతివిభూతిజెడిపోవు। పరిఖ్యాత పురుషవారితములలో జేరగాలేవు ఆతతాయులలోన జేర్చిన। భూతలంబున బ్రతుకు బ్రతుకా రోతమత్తుపదార్థముల దలపోత। లతింతలనొనర్చునె ॥కల్లు॥

ఎందుకై బుట్టితిమొతెలియమా। కొందర్గునరహరియందు చిత్తము జేర్చిమనలెమా। సందియంబులమాని జగతిపనందు మార్గమునందు మెసలినగందుమిక శ్రేయంబు।మీకిక వందనములర్పించువాడను॥కల్లు॥

---

• చిదిరె లక్ష్మణ శర్మ •

: మాదిరి :

( హరిభజన నోటనరా )

ఇల్లుపాడై పాయెనఖుడా। మన్య। మింపైనకొలదినీకిక నేమి ఎఱుకా। ఉల్లానమినుమంతజూడ। అకట। తల్లిపెద్దక్కయింటిలో నాట్యమాడ



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



పలుగాకిసోపతిగూడి । యిట్టి । పనులుజేయుటనీకు ఫలమెయీపాడి ।
తలియముంతకువచ్చెదాడి । యింత । తెలయవు నీకుజెప్పితిగద వేడి ॥
పైసతోనిది మొదలాయె । కల్లు । ప్రిబలినహూకలు సరిపోకపాయె ।
వేషాలుకడు వేసుటాయె । తుదకు । గోసాయివేషము కొనినట్లులాయె ।
చిల్లెరసిగరేట్లకాయ । సార । కల్లుకైనీయాస్తి చెల్లింపనాయె ।
ఇల్లాలుసొమ్మంతబాయె । ముందు । పిల్లలగతియెట్టులో దోచదాయె ॥
తిండికిలేకపాయె । కల్లు । కుండదెచ్చుటకు గింజలనమ్మటాయె ।
వెండిబంగారంబుబాయె । పూరిగుడిసెనేదక్కదాయె ।

పైసయొక్కడు నమ్మడాయె ।మద్య। పానంబుకై దొంగపనులు
మెండాయె । దోసమంచునుదోచదాయె । అందోల్ । వాసలక్ష్మణ
వరదశ్రీశయెటులాయె ॥

---

• కొండపర్తి వీరమల్లయ్య •

పల్లవి

ఏటికీ కలుదా్రివు కోరిక యెంతజెప్పిన విడవ్రుజీవా.

---

కాయకష్టముజేసి పూటకు । కాస్తధనమార్జించి పొట్టను
బోసుకొనగనుజాల నప్పుడు । బోయెదేటికి కల్లుదా్రివను ॥ఏటి



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



భార్య పిల్లలు యింటిలోపల । కూటికై విలపించుచుండగ
నేటికీయభ్యాసచింతన । మేలవిడువవుకల్లు దాగుట ॥ ఏటి ॥

కల్లుదాగినవారి పాటును । గాంచుచుండియు విడువలేవు
మెల్లగను ధనమెల్లబోవును । మంటి ముంతలు చేతికొచ్చును ॥ ఏటి ॥

నీతదప్పిన వాడవౌదువు । నీచునిగ భావింతురెల్లరు
చోటులేదిక సభలయందున । సుజనసంఘముచేరనీయరు ॥ ఏటి ॥

త్రాగుబోతని యెల్లవారలు । గేలిజేతురు నిన్నుజూచుచు
మానధనమునుబోవు తదుపరి । మనుజ జన్మంబేలనీకు ॥ ఏటి ॥

మాటనమ్మరు చుట్టపక్కము । మద్యమును సేవించువారల
పాటవము జెడిపోవు దేహము । బహుగరోగములంది మృతుడౌ ॥ ఏటి ॥

కల్లుదాగియు కీచకుండు । వాళ్ళ తెలియక ప్రాణమిడిచెను
అల్లశుక్రుడు కల్లులోపల । కచునిమ్రింగియు కష్టపడియెను ॥ ఏటి ॥

నీచమగు నీకల్లుద్రాగుట । దోసమని యెరుగంగలేకను
మోసపోకుము నాలుపిల్లల । దాస్యమును విడిపించవేటికి ॥ ఏటి ॥

కష్టపడినార్జించి ద్రవ్యము । యిష్టమొచ్చిన యట్లునీకై
నష్టపెట్టుచు కల్లుదాగుచు । దుష్టులను గూడంగనేటికి ॥ ఏటి ॥

బలము కల్గిన కాలమందున । బాగుగను ద్రవ్యంబుగూర్చిన ।
ప్రాయముడిగిన వెనుకనీకది । బంధువై రక్షించు లెస్సగ ॥ ఏటి ॥

---



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



♦ చాగంటి భాస్కర లింగశాస్త్రి ♦

మధురకవితా హృదయములో ముదముతో బ్రసరించుముక్తసి
బధిరముగ నొనగూర్చిసద్గురు బోధదూరముజేయు మద్యము
త్రాగబోకుమురా ఓరి మనుజుడా త్రాగబోకుమురా ॥
సరసులకు నపఖ్యాతిగూర్చును విరసముగ మాట్లాడబూడ్చును
పరమభక్తుల తూలనాడును నిరతమును మద్యమునుత్రాగకు
త్రాగబోకుమురా ఓరి మనుజుడా త్రాగబోకుమురా ॥
చిన్న పెద్దలు జేరనీయరు బన్నుగానీ రూపమారయ
దున్నపోతని భ్రాంతిపడుదురు సన్నగిలవలె మద్యపానము
త్రాగబోకుమురా ఓరి మనుజుడా త్రాగబోకుమురా ॥
భాస్వరంబగుకీర్తినెల్లెడ బారదోలును సుస్వరంబకాగించు చూడ్కుల
నంచును
యీశ్వరార్చనదలపు జూపదు విశ్వము వెగటంచు జూతురు
త్రాగబోకుమురా ఓరి మనుజుడా త్రాగబోకుమురా ॥

---

♦ మల్లిపాం సుందరరాజు ♦

మానుమయ్యా భరతపుత్రా మానుమయ్యా నుతచరిత్రా
ఎంసు కేమధుపాన రక్కసి డెందములు చెండాడువేగమే



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మల్లిహం సుందరరాజు

ఆర్యపుత్రా ఆలకింపర ఆర్యకీర్తిని తెలుసుకోరా
గుండెలవియగ జేయు హైన్యపు బండబూతులు కూయజేయును
గండమొండి శిఖండిపీడ దండిగా దూషింత్రు, త్రాగుడు
మానుకోరా మానచోరా హీనబుద్ధి దీనివిడురా
గుండెకాయను పిండిపిండిగ చెండితూటుపడంగ సేసెడు
మొండిరక్కసి మద్యపానశి ఖండిగుండి యవ్రియ్యాదన్నర
అన్నలారా అయ్యలారా చిన్నతనమిది వీడుడయ్యా
ఇల్లునోడలును గుల్లసేసెడు కల్లుయను పెనుభూతరక్కసి
యులమున్ మరి చొచ్చెనేనియు కల్లకాదు ప్రమాదములుకడు
సంభవించును సఖుడమనకు సంభవంబిది సచ్చరిత్రా
ఆలుబిడ్డల నేడిపింపకు మూలసూత్రము తెలుసుకొమ్మా
ప్రకృతికి విరుద్ధముగనీవు వెకలివై తిరుగంగ బోకుము
మద్యపానము మానుహృదయమ మిథ్యగూ దేహంబు తెలియుము
మద్యపాన రక్కసిని మన మధ్యనుండియు తోలుదము, మన
మందిరమ్ము యేకమైతే ముందుగానే పారిపోవును
వేడిరక్తము లేదనీలో మూఢచిత్తమ తెలుసుకొమ్మా
పశుబలమ్మును జూపిదనుజులు కచుడునంత మహానుభావు నె
వధను సేసిరి యొడలు తెలియక మధువుత్రాగుట చేతనే గదా
భారతపుత్రా మానవయ్యా నరసుగోత్రిలు శుద్ధతః ప్రగి



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

మద్యనిరోధక గీతావళి

అసురగురువైన శుక్రుడు యొసగె శాసనముకట్టడి
శాప మొసగెను కల్లుత్రాగిన పాపమంచూ జనులకయ్యది
దరికిపోకుమ తండ్రినీవు పరువుపోవునటంచుని బుధులు
చక్రవర్తి యలెగ్జాండరు వక్రబుద్ధియి ప్రాణసఖునే
ప్రాణములు దీయింపజేసెను త్రాగుబోతు తనమ్ము చేతనే
కల్లుత్రాగుటమానుమయ్యా ఇల్లునొళ్లును గుల్లయగుగా
కులము, శీలము, బలము, ఘనతయు కలధనమ్ముగనుపోవు, పెద్దను
యిల్లుజొచ్చును పెద్దలంద తులువయని దూషింతురు చిత్తమ
ఎట్టులోర్చెదు యిట్టిమాటలు గట్టిగా యోచించిచూడుము
పావనుండగు మదనమోహను దేవసముడగు గాంధిదేవుడు
పుట్టినట్టిపుణ్యభూమిని ముట్టుకోనని యొట్టుబెట్టుకో
సిగ్గుచేటుర చిన్నయన్నా పెగ్గుమానుర పెద్దయన్నా

---

♦ నరహరి గోపాలాచార్యులు ♦

: ఏకతాళం :

: పల్లవి :

సోదరులారా వినుడీ సత్యంబైదనరెడి వాక్యములను మీరిక ॥సో॥
ఆత్మధర్మములనగ ద్రొక్కుచు యనాత్మధర్మముల నాచరించి



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

జా వ వ

మీయాత్మ గేహతను సంసారములనుయాత్మబుద్ధి చేనంతేము సేతురె॥సా॥
మనసోదరులెటు మద్యమాంసములనూని ధనంబుగడించి సుఖపడిరో
మనమునయరసి చరించుటొప్పదా మానవధర్మము జూడగావలదే ॥సా॥
ఒక వృక్షమున శాఖోపశాఖ లున్నరీతిని జగత్కుటుంబియే
విక చకమల నేతురికు మనతండ్రికి సకలజనుల మిలపుత్రులమెకదా ॥సా॥
నిఖిలజీవ సౌభాత్రము నెరపుట నిర్మలబుద్ధికి కార్యమగుట మీ
కఖిలశోభన ప్రదమగుమార్గము నర్మిలిమద్యము మాంసము విడచుటె
అతి కష్టముచేనార్జించిన ధన మతిసుఖదాయినియగు భార్యకు
సంతతముద మొసగెడి పుత్రులకును ధర్మతతికిడుడు మద్యమునకు
నిడకుడు ॥సా॥
తానుసగుణమున దనరుచుమద్యము ద్రావినతోడనె తనమన
ధనముల
పై మతిచెడి హీనతబడివీధులలో మసలిమసలిగుందు టె ఫలమా ॥సా॥

---

• జా వ వ •

: మాదిరి .

( కటకటా యేసునాధ )

మానవులారావినుడి మానుడుకల్లుసారా
మానముధనము తెలవి మాయమౌదానిద్వారా



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



మెదడును జేయు మొద్దు మేదిజ్ఞానంబురద్దు
వదరుబోతునుచేయు వద్దుమరికల్లు వద్దు ॥
నెత్తురుచెడునుగుండె తత్తరమొందుచుండు
మొత్తమైనరోగములు మూడునుసారవలన ॥
చూపునుతగ్గించు సోమరితనముబెంచు
తాపముహెచ్చును తాగుడువలన మీకు ॥
ఆకలిబోగొట్టు నలసటరాబట్టు
వాకరింతలుబుట్టు వలదు యీసారనలదు ॥
త్రాచుకాటున విషము తనువందేవ్యాపించు ॥
తాగుడు వలని విషము తరమంత వ్యాపించు ॥
నూఱుకోని పెద్దపులిని మహిం బ్రతుకవచ్చుగాని
సారగిడ్డంగినిదూరియు బ్రతుకుటరుదు ॥
దోషముగూర్చు సర్వ నాశనమొనరించు
జాషువమొరనాలించి చాలించుమికనుసారా ॥

---



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

మద్యనిరోధక గీతావళి

• భాస్కరభట్ల కృష్ణారావు •

: వరుస :

"జనగణమన అధినాయక జయహే భారతభాగ్య విధాతా"

పల్లవి

వినుడిక భారత సోదరులారా
మనవి యొనర్చెద మీకూ—
అనయము మీరీ మద్యము గ్రోలిన
తనుధనములు నశియించునుగా—

ఘనతవహించిన మనప్రభువర్యుడు
మనలను మద్యము మానుమనీ
తనర నిరోధక కేంద్రసంఘమును
తగ నిర్మింపగ జేసె—

పలు దేశంబుల ప్రజలీ ఘోర
పిశాచిని విడిల్చుకొనిరీ
మనమును మద్యము మానిన
సౌఖ్యముమానక కల్గును విధిగా

వాశిగ మీరీ మద్యము మానిన
దేశము శుభములగాంచు—
సవినయముగ భాస్కరుడిటు
పలికెను నిస్పృహ నిరసించకుడీ



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



• కొమరగిరి వెంకటనారాయణరావు •

గాలమే విధి యండజంబును
గట్టివలబడ వేయునో
కాల వ్మృత్యువు వలెనె మిమ్మది
కఠిన నరకము కంపును.

దమ్ముమీదను దమ్ముదగిలిన
మిమ్ముమీరే యెరుగరు
మిమ్ముమీరే యెరుగకుండిన
సొమ్మసిలిబడి పోదురు.

తాతతండ్రులు కూడబెట్టిన
ధనము నదీ హరియించును
తుదకు తినుటకు కట్టుకొనుటకు
దుష్కరంబయి పోవును.

ఇహమునందును పరమునందును
యెందుకును గాకుండును
కడ కధోగతి పాలుజేయును
కష్టజలధిలో బడుదురు.



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ఎందుకును కొరగాని దీనిని
కెందుకిక వదలంగజాలరు ?
ఎన్నికోట్లో యిందువలనను
మన్ను పాలగుచున్నవి.

పవలు రాత్రియు కష్టిపడుచును
బరముగాగొను ద్రవ్యముల్
పరమహేయము మైనదీనికి
పాడుసేయుట న్యాయమా ?

---

• వెల్దుర్తి మాణిక్యరావు •

పిల్లబేకలుయింట మెచ్చుచుండినను
బట్టపొట్టకు మాకు కష్టమొచ్చినను
తరతరంబులనుండి చెలిమిచేసితిమి
తిన్నింటి వాసాల మెంచేటినీతో
సమ్మిచ్చి బొండిగను కోసేటినీతో

నడిబజారులో మావి మానాలుతీసి
నడివయస్సులో మావి ప్రాణాలుతీసి
తీరపండుగనాడు నిలువునాదోచి
కట్టుకొంటివి నీవు పాపాలముళ్లె



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

వెల్దుర్తి మాణిక్యరావు

పై పెచ్చురోగాలు అభియోగములును
పాడుచేసెను మమ్ము నీవెంటవచ్చి
ఈరీతి పదికోట్లు పాడుచేసెటి
సఖ్యంబు నీతోటి చాలుమాకింక

కేంద్రసంఘంబొకటి మానగరమందు
నిన్ను అరికట్టుటకు స్థాపితంబయ్యె
మద్యమా నూరేండ్లు నీకునిండినవి
మారుపలుకక పొమ్ము మమ్ము విడనాడి

మాప్రభువు నీమీద క్రుద్ధుడైనాడు
మారాజ్యమున నీకు చోటులేదింక
తరిమివేయకముందు మద్యమా నీవె
మరలచూడక పొమ్ము పొలిమెరావలకు.





CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

# మద్యపాన నిరోధక కేంద్రసంఘము

## సంఘ నియమములు

౧. హైదరాబాదు మద్యపాన నిరోధక సంస్థ ఈ క్రిందివారితో కూడియుండును.

(అ) మ. ఘ. వ. నిజాంప్రభువుగారి ఫర్మానుద్వారా పేర్కొనబడిన హైదాబ్రాదు మద్యపాన నిరోధక కేంద్ర సంఘ సభ్యులు.

(ఆ) సానుభూతికలవారు. వీరు సహకారులని పిలువబడుదురు.

౨. (అ) సహకారులు ఈక్రింది నాలుగు తరగతులుగా నుందురు.

(క) పోషక సహకారులు.

(ఖ) యావజ్జీవిత సహకారులు.

(గ) సాధారణ సహకారులు.

(ఘ) విద్యార్థి సహకారులు.

(ఆ) కనీసము (౨౦౦) రూపాయిలు ఒక్క మొత్తమున ఇచ్చువారు పోషక సహకారులగుదురు.

(ఇ) కనీసము (౧౦౦) రూపాయిలు ఒక్క మొత్తమున ఇచ్చువారు యావజ్జీవిత సహకారులగుదురు.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

(ఈ) మద్యపాన నిరోధక పత్రిక చందాదారులుగా చేరినవారును సంవత్సరమునకు కనీసము ఒక్క రూపాయి మాత్రమే చందా చెల్లించువారును సాధారణ సహకారులగుదురు.

(ఉ) నిజమైన విద్యార్థులు, విద్యార్థి సహకారులగుదురు. వారు సంవత్సరానికి నాలుగణాలుమాత్రమే చందా చెల్లింతురు.

3. మ. ఘ. వ. నిజాంప్రభువుగారి ఫర్మానుద్వారా పేర్కొనబడిన మద్యపాన నిరోధక కేంద్రసంఘ సభ్యులు సంవత్సరమునకు కనీసము ౨౫ రూ. ల చందా చెల్లింతురు.

౪. పైన పేర్కొనబడినటుల యావజ్జీవిత సహకారులుగా, పోషక సహకారులుగా, లేక సాధారణ సహకారులుగ, చేరిన సహకారులు ఎట్టిసంఖ్యగలవారైనను, హైదాబాదులోగాని, జిల్లాలలోగాని సంఘములు స్థాపించుకొనుటకు, మద్యపాన నిరోధక కేంద్రసంఘమునకు దాని శాఖగా అంగీకరించుకొరకు విన్నవించుటకు, స్వేచ్ఛకలిగియుందురు.

వివరణ: పోషక సహకారులు, యావజ్జీవిత సహకారులు, మరియు సాధారణ సహకారులు, లేక ఈ తరగతులలోని ఏరెండు లేక ఎక్కువ తరగతులు ఒక సంఘముగా నేర్పడవచ్చును. మరియు ఇట్టి ఏదేని సంఘము, పై ఏదేని తరగతి వరకే బంధింపబడుట అనవసరము.

౫. విద్యార్థి సహకారులవిషయమున, ఏదేనిప్రత్యేక సంస్థకు జెందినవారును, చెందనివారును, ఏదేనిసంఖ్యగల విద్యార్థి



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

సహకారులు మాత్రమేకల సంఘమును స్థాపించుటకు స్వతంత్రులై యుండును.

౬. పై వాటితోబాటు, తన దృష్టిలో అవసరమనిపించిన చోట మద్యపాన నిరోధక కేంద్రసంఘము శాఖను స్థాపించును.

౭. హైదరాబాదులోగాని, జిల్లాలలోగాని, వున్న విద్యార్థి సహాయకులు మాత్రమేగల ఏదేని శాఖ అట్టి విద్యార్థి సహకారుల ప్రతి ౫౦ లేక భాగమునకు ఒక్క ప్రతినిధిని ఈక్రింద వర్ణింపబడినట్టి మండల సభలకు పంపు అధికారము కలిగియుండును.

ఉదాహరణ: సంఘములో ౭౫గురు సభ్యులున్నచో ౨ ప్రతి నిధులను పంపుటకు ఆసంఘము అధికారము కలిగియుండును.

౮. హైదరాబాదు మద్యపాన నిరోధక సంస్థయొక్క సభలు రెండు విధములుగా నుండును.

౧. ప్రత్యేకముగా మద్యపాన నిరోధక కేంద్ర సంఘసభలు
౨. ఈక్రింద తొమ్మిదవ నియమమునవర్ణింపబడినట్టి మండల సభలు.

౯. మద్యపాన నిరోధక కేంద్ర సంఘసభ్యులు, మరియు ౭వ నియమము ప్రకారము ఎన్నుకొనబడిన విద్యార్థి సహకారులతోబాటు వివిధ శాఖల సభ్యులు కలిసికొనుసభలు మండల సభలనబడును.



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

౧౦. మండల సభలు రెండు విధములుగా విభజింపబడును.

౧. నగరమండల సభ. దీనిలో మద్యపాన నిరోధక కేంద్రి సంఘసభ్యులు, హైదరాబాదు నగరములో పనిచేయుచున్న శాఖలయొక్క సభ్యులు, ౭వ నియమము ప్రకారము పేర్కొనబడిన నగర విద్యార్థి సహకారులు, పాల్గొనెదరు.

౨. రాష్ట్రమండల సభ. దీనిలో మద్యపాన నిరోధక కేంద్రి సంఘ సభ్యులు, జిల్లాలలోపనిచేయుచున్న శాఖలయొక్క సభ్యులు, జిల్లాలలోని విద్యార్థుల ప్రతినిధులు, పాల్గొనెదరు.

౧౧. అవసరమునుబట్టి ఎన్నిసారులైనను నగర మండల సమావేశములు జరుగును. రాష్ట్రమండలసమావేశము కనీసము సంవత్సరమున కొకసారి అగును.

౧౨. విద్యార్థి సహకారులు మండల సభలకు రావచ్చును, కాని చర్చలలో పాల్గొనుటకు అధికారముండదు. అయినను నియమము ౭ ప్రకారము పేర్కొనబడిన విద్యార్థి ప్రతినిధులు మండల సభలచర్చలలో పాల్గొను అధికారము కలిగియుందురు,

౧౩. ఈ నియమముల క్రింద స్థాపించబడిన శాఖలు, అప్పటి కప్పుడు మద్యపాన నిరోధక కేంద్రి సంఘముచే నియమింపబడుచుండు విధానమునకు బద్ధులై కేంద్రిసంఘ ఆజ్ఞల ప్రకారము నడుచుకొనును.



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

# మద్యపాన నిరోధక కేంద్రసంఘ కార్యదర్శి గారికి

అయ్యా !

నేను పై సంఘ నియమములను శ్రద్ధతో చదివినాను. ౨వ నియమము పరికారము / పోషక / యావజ్జీవిత / సాధారణ / విద్యార్థి

అవసరమైన మొత్తమును..............ద్వారా పంపించుచున్నాను. కనుక నన్ను యావజ్జీవిత / సాధారణ / విద్యార్థి సహకారిగా చేర్చుకొని అట్లు జేసిన సమాచారమును తెలుప ప్రార్థితులు.

పూర్తివిలాసము:—

పేరు.

ఇట్లు

గ్రామము.

తాలుక. జిల్లా.

(సంతకము)

తపాల.

...GADGURU VISHWARADHYA
...NA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. ....2027....

CC-0. Jangamwadi Math Collection. Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

# చదువండి

మద్యనిరోధక కేంద్రసంఘ పక్షమున తెనుగు, ఉర్దు మరియు మహారాష్ట్ర భాషలలో మద్యపాన నిరోధక మాస పత్రికలు సక్రమముగా ప్రచురింప బడుచున్నవి. మొహరు ౪౮ ఫ. నుండి కన్నడ భాషలోగూడ ప్రచురింపబడును.

ఆర్థిక నైతిక సంపత్తిని — హరించి దేహ దార్ఢ్యతను తగ్గించి, మనోవికాసమును హరించి, ఆత్మబలమును అంత రింపజేసి, మన జాతిని సర్వనాశన మొనరించుచున్న కల్లు, సారాయి, గంజాయి, నల్లమందు, చండు, చరస్, భంగు మొదలగు మత్తుకలిగించు పదార్థములను గురించిన వ్యాసములు, కథలు, పద్యములు పాటలు అంతేగాదు, నేటి మన దేశీయవార్తలేగాక సముద్రపావలి సమాచారములు సైతము ఈ పత్రికలందు ప్రకటింపబడును. ఇంతకు వార్షిక మూల్యము ౧-౪-౦ మాత్రమే.

ఇంకొక విషయము విన్నవించవలసియున్నది. అదే మన ఈ పత్రికా రూపమునగానీ, సహకారులు చెల్లించు రుసుము కిందగాని వచ్చు మొత్తము ముఖ పృష్ఠముపై అచ్చుపడినట్టి మద్యనిరోధక గూడెముల నిర్మించుటకై వినియోగింపబడును. అట్టి గూడెములు నామకార్థమైన అద్దెపై బీదలకియ్యబడును.

**మానవసేవయే మాధవసేవయని తలంచి**

ఇట్టి సదుద్యమమునకు చేయూత నొసగుడని ప్రార్థన.

ఇట్లు,

కార్యదర్శి.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.